


కెప్టెన్ పిల్లి అమెరికా సైన్యంలో చేరింది.
ఎవరూ చూడనప్పుడు అది లోపలికి దూరింది.



అక్కడ సైనికులు కవాతు చేస్తున్నారు.
లెఫ్ట్, రైట్, లెఫ్ట్, రైట్...

లెఫ్ట్, రైట్...



కెప్టెన్ పిల్లి కూడా అడుగులో
అడుగు కలిపి కవాతు చేసింది.

ఎడమ, కుడి మధ్య తేడా
కెప్టెన్ పిల్లికి తెలుసు.



“ఆ పిల్లి ఒంటి మీద మన యూనిఫాం ఉన్న
వాటి కంటే ఎక్కువ చారలు ఉన్నాయి,"
సార్జెంట్‌తో ఒక కార్పోరల్ అంటోంది.

“మియావ్," అంది కెప్టెన్ పిల్లి.
పిల్లి వైపు చూశాడు సార్జెంట్.
“చెప్పండి, సర్!" అంటూ సార్జెంట్ నవ్వాడు.

అప్పటి నుంచి బెటాలియన్ మొత్తం
దానిని కెప్టెన్ పిల్లి అని
పిలవసాగింది. ఇప్పుడు దానిని
ఎవరూ “పిల్లీ" అని పిలవటం లేదు.





ఒక్కొక్కసారి కెప్టెన్ పిల్లి కోసం సైనికులు
ఎవ్వరికీ సమయం  ఉండేది కాదు.

“నేను ఇప్పుడు స్నానాల గదులు
శుభ్రం చెయ్యాలి,"
ఒక సైనికుడు అన్నాడు.



“నేను రోడ్లు శుభ్రం చెయ్యాలి,"
రెండవ సైనికుడు అన్నాడు.



డ్యూటీలో ఉన్నా, లేకపోయినా సైనికుడు
పీట్‌కి మాత్రం కెప్టెన్ పిల్లి  కోసం ఎప్పుడూ
సమయం ఉండేది.
“నిన్ను చూస్తే మా ఇంటి పిల్లి గుర్తుకు
వస్తుంది," అని అతను అనేవాడు. ఆ
తరవాత కెప్టెన్ పిల్లి చెవుల వెనక
నిమిరేవాడు.



అప్పుడప్పుడు కెప్టెన్ పిల్లితో పీట్
ఆటలలో మునిగిపోయి...

...ఇబ్బందులలో చిక్కుకునేవాడు.

పీట్‌కి బెటాలియన్ జనరల్ వంట పని అప్పగించాడు. అక్కడ అతడు కెప్టెన్ పిల్లిని ఆలుగడ్డ పొట్టుతో ఆడుకోనిచ్చా .

“నువ్వు నాతో స్నేహం చేస్తావా?" పీట్ అడిగాడు.

“మియావ్," అంటూ కెప్టెన్ పిల్లి బదులిచ్చింది.







మరునాడు ఉదయం నిద్ర
లేపటానికి గంట మోగింది.
పొద్దున్నే లేవటం పీట్‌కి ఏమాత్రం
ఇష్టం లేదు!

కానీ, కెప్టెన్ పిల్లి
చెంగుమంటూ లేచేస్తుంది.



ముందుగా అది చెత్త
కుండీని తనిఖీ చేస్తుంది.

తరవాత, పారిశుద్ధ్య కార్మికులు
వాటిని ఖాళీ చేస్తారు.



ఇన్‌స్పెక్షన్ కోసం సైనికులు అందరూ
వరసలో నిలబడతారు.

కెప్టెన్ పిల్లి కూడా వరసలో నిలబడుతుంది.



ఇన్‌స్పెక్షన్ సమయంలో జనరల్ ఒక
సైనికుడి తుపాకీని సరిచేశాడు.

పీట్ టోపీని ఆయన సరిచేశాడు.



కెప్టెన్ పిల్లి మీసాలను
జనరల్ సరిచేశాడు.



"ముందుకు పదండి!" జనరల్
ఆదేశాలు ఇచ్చాడు.



అప్పుడు సైనికులంతా ఒక వైపుకి వెళితే
కెప్టెన్ పిల్లి మాత్రం మరో వైపుకి వెళ్లింది.

అది పిట్టలను తరమాల్సి ఉంది.



తరవాత సైనికులు బురదలో
ముందుకి పాకారు.

వానలో పరిగెత్తారు.

అయితే, కెప్టెన్ పిల్లికి ఇవేమీ
చెయ్యాల్సిన పని లేదు!
పీట్ మంచం మీద అది హాయిగా
నిద్ర పోతూ ఉంది.





మధ్యాహ్న భోజన సమయం అయ్యింది!
వేడి వేడి భోజనం కోసం పీట్, ఇతర సైనికులు
పరిగెత్తుకుంటూ భోజనశాలలోకి వచ్చారు.

'ఎలుక మాంసం పెడితే ఎంత
బాగుంటుంది,'
కెప్టెన్ పిల్లి మనసులోనే అనుకుంది.




"నువ్వు నాతో స్నేహం చేస్తావా?" పీట్ అడిగాడు.
"మియావ్," అంటూ కెప్టెన్ పిల్లి బదులిచ్చింది.





రాత్రి అయ్యింది!
నిద్రపోటానికి లైట్లు తీసేశారు.
అందరూ నిద్రపోతున్నారు. తమకి ఇష్టమైన
వాళ్ల గురించి కలలు కంటున్నారు.



కెప్టెన్ పిల్లి కూడా తన స్నేహితుడి

గురించి కల కంటోంది!

అయిపోయింది